Regd No N44
M. 3816

103046

విడిప్రతిక ౦-౧-౨

To Let

# గోలకొండ పత్రిక



ప్రతి సోమ, గురువారములందు వెలువడు అర్ధవార జాతీయ పత్రిక

సంపుటము ౧౭ ● హైద్రాబాదు దక్కన్ శా. శ. ౧౮౬౫ స్వభాను మార్గశిర బ. ౨ [౯-౩-౧౩౫౩ ఫ.] సోమవారము ● సంచిక ౭౦

# తుర్కీ మిత్రమండలివైపు వాలినది

## చర్చిలు రూజ్వెల్టుగారలతో తుర్కీ అధ్యక్షుని సంభాషణల ఫలితము

### జపానువారి మార్షల్ దీవులపై అమెరికను విమానాల దాడులు

డిసంబరు ౬,౭,౮వ, ౯,౧౦వ తేదులలో నానా కేంద్రములనుండి ప్రకటితములైన యుద్ధ వార్తల సింహావలోకనమును ఇట చేసెదము.

#### ఇండియా

ఇండియాలో ప్రధానకార్యాలయ ముండునట్లు చేసి ఆసియాఖండపు ఆగ్నేయభాగమందలి యుద్ధ చర్యలలో సేనలనునడిపించుటకుకమాండ్ బ్యాటన్ గారు నియుక్తులైయుండిరిగదా, ఇపుడు వీరియుద్ధ చర్యలనునైఋతి పసిఫిక్ భాగమందు మాకార్థర్ గారి సాయకత్వమున జరిగెడియుద్ధచర్యలు, ఒక దానికొకటి అనుకూలముగా జరుగుచో జపానును జయించుటని చాలాసులువగునని తలచి, ఇపుడు శక్తి సహాకారమునకు పునాదివేర్పరచుటకై క్రొత్తఢిల్లిలో ఆలోచనలు చేయబడుచున్నవి.

#### బర్మా

బర్మాలో అరకాను ప్రదేశమున బ్రిటిషువారి యొక్కయు జపానువారియొక్కయు పెట్రోలు సేనల పోరాటములు చురుకుగాజరుగుచున్నవి.

బర్మాపై ప్రతిరోజు బ్రిటిషువారియొక్కయు అమెరికావారి యొక్కయు విమానములు దాడు లనుచేయుచు బర్మానాక్రమించియున్నజపానీయ సేనలకు నష్టములను ఎక్కువగా కలిగించుచునే యున్నవి.

#### చైనా

చైనామధ్యభాగమందు టున్గటిన్గుసరస్సునకు పశ్చిమమునందు చాంగ్టెపట్టణమును ౧౫రోజులముట్టడి చేసి జపానీయసేనలు డిసంబరు౩ తేదిన వశపరచు కొనినవి. ఆటుతర్వాత మరల౫రోజులకు చైనీయ సేనలు దానిని పునరాక్రమించినవి.

హూనానురాష్ట్ర దక్షిణభాగమందు జపానీయసేనల ప్రధానమూలస్థానమగు సిన్యాన్గులోకి చైనీయసేనలు చొరపడినవి.

#### పసిఫిక్ ప్రదేశము

పసిఫిక్ప్రదేశమందు న్యూగినీలో ఆస్ట్రేలియా వారిసేనలకు వాసోక్కనుపట్టుకొని దానికి ఉత్తరముగాపోయి వారిబోనుకూడ ఆక్రమించిరి.

డిసంబరు౪ తేదిన అమెరికావారి విమాన వాహకనౌకల నుండి విమానాలు జపానువారి మార్షల్ దీవులపై దాడిచేయుటవల్ల ఆరుజపానీయ నౌకలు నీటమునిగినవి, మరినాలుగు జపానీయ నౌకలు చెడిపోయినవి. అమెరికనువిమానవాహక నౌకలు ఈదాడిని ముగించి తిరిగివచ్చుచుండెనపుడు సుమారు ౨౦ జపానీయవిమానాలు ఆనౌకలపై ౭౪గంటలసేపు టూర్పడోలతో దెబ్బలను వేసినవి.

ఇట్లే మరికొన్ని విమానవాహక నౌకలనుండి విమానాలు నౌరుదీవిమీకి డిసంబరు ౮ తేదిన పోయి బాంబులనువేసినవి.

పసిఫిక్ ప్రదేశములో అమెరికా సంయుక్త రాజ్యమువారు జలాన్తర్గాములు ౧౧ జపానీయ వాణిజ్యనౌకలను ముంచివేసినట్లు డిసంబరు ౭ తేదిన ప్రకటితమైనవి.

#### అట్లాంటిక్ సముద్రంలో నౌకాయుద్ధము

పోయిన నవంబరునెలలో అట్లాంటిక్సముద్రమందు తిరుగుచున్న బ్రిటీషుమిత్రమండలి వాణిజ్య నౌకలలోజర్మనులయూబోటులచేముంచివేయబడి నట్టి వాటిసంఖ్య గారంభమైననెలనుండి మరేనెలలో గానిమునుగబడిన వాణిజ్యనౌకలసంఖ్యకంటె కూడ తక్కువగానున్నట్లు ప్రకటించబడినది. అంటే జర్మనులయూబోటులశక్తి అంతతగ్గినదని అర్థము.

పోయినవప్రిలునెలనుండి అమెరికాసంయుక్త రాజ్యము వారి నౌకానిర్మాణశాలలవద్ద నిర్మితములైననౌకల లెక్కసగటున రోజుగకేఆయినిటికంటె మించినది.యీరాజ్యసేనలో అధికారులును, సైనికులునుకలిసి ౭౭లక్షల మంది కావచ్చునున్నారు, సేనలనుండి పెద్ద ౧౦వేలనౌకలనునిర్మించుటను ఆ రాజ్యపు నౌకాశాఖ గాక సంకల్పించిరి, వాటిలో ౫౫వేలనౌకలు అప్పుడేనిర్మితములైనవి, మొత్తము మీద వీటినిర్మాణవ్యయము ౫౦౦కోట్లు మొదలు ౬౦౦కోట్ల డాలరులవరకగును, ఈలెక్కలన్నియు అధికారులచేతనే ప్రకటితములైనవి,

బ్రిటిషు విమానాలును అమెరికను విమానాలును బాంబులనువేయుటచే అనుజర్మను యూబోట్లు నాశనమైనవి,

#### బ్రిటిషు, జర్మనీలపై విమానాలదాడులు

బ్రిటనుపై జర్మనులయొక్కయు జర్మనీపైనను, జర్మనులాక్రమించియున్నరాజ్యాలపైనను బ్రిటను యొక్కయు విమానాలదాడులనుగురించిన వార్తలు ఈసారిలేవు,

#### ఇటలీ

ఇటలీలో బ్రిటీషు ౮వసేనలు కాసినోవద్ద జర్మనులరక్షణస్థానాలను డిసంబరు ౫వ తేదిన భేదించి ౬వ తేదిన రోమునగరమును చేరుటను కన్నిటిలోను ఎక్కువ దగ్గరిబాటపోవులిరిలోయయొక్క పడమట యుద్ధముచేసినవి, సాంగ్రోనదికి మైళ్ళఉత్తరమునందు మోరో దిదాటినవి, తర్వాత మోరో నదిని మధ్యతీక్ష్ణమైన యుద్ధంజరిగినది. బ్రిటిషు సేనలు మోరోనది నుండి సముద్రతీరము వెంట పెస్కారావైపు యాత్రసాగించినవి, డిసంబరు ౭ తేదిన బ్రిటిషుసేనలు కామినో ఆనేకొండమీద నుండు మొనాస్టరీ అనుశిఖరము పోగొట్టుకొని యుండిరి గాని ౧౦వ తేదినాటికి పునరాక్రమించినవి, ఆసేనలే మిగ్నానోకు నైఋతిదిశలో ఆరుమైళ్ళ దూరములోనుండు రెండు గ్రామములను ఆక్రమించినవి, మిగ్నానోకు ఆరుమైళ్ళ నైఋతి దిశలోనుండుకలాబ్రిటోపట్టణము ఆఖరుకుబ్రిటిషు సేనలవశమైనది,

అమెరికావారిసేనలు డిసంబరు౬ తేదిన మాగియోరువద్ద జర్మనురక్షణ స్థానములభేదించి ఆ మరునాడు లిర్రిలోయయొక్క పడమట యుద్ధము చేసినవి, మిగ్నానోపట్టణమున కైమయిల నుండు మూడు జర్మనురక్షణస్థానములనవి పట్టుకొనినవి. డిసంబరు౯ తేదినాటికి ఆ రోమునగరమునకు పశ్చిమముఖముగా పోవురోడ్డును అడ్డముగానుండు కామినోకొండమద్య నున్న శిఖరముకొనినవి ఆకొండ యొక్క పాదభాగమందు ఉండేకామినో, ఆ క్వాపెండులా, కోపరెజో అను మూడుగ్రామాలను కూడ అమెరికనుసేనలు ఆక్రమించినవి, కాసినోప్రదేశమునకుచేర్చుబాటకుఅడ్డముగనుండు పర్వతపంక్తిలో అమెరికనుసేనలు ప్రవేశించినవి, ఇపుడుమాగియోరుపర్వతప్రదేశమంతయును, అందలి ఉన్నతమైనభాగముతప్ప అమెరికనుసేనల వశమందున్నది, కామినోనుండి మాగియోరువరకు గల ప్రదేశమందు ఇపుడుజర్మనులకు రెండేరక్షణ స్థానములు మిగిలియున్నవి, వెనాఫ్రొకుపడమట అమెరికనులు కొత్తకీలకస్థానములను జయించినారు

జర్మనుల ఎదురుదాడులు చాలతీక్ష్ణముగ ఉండినవి,

ఈమధ్య యుద్ధరంగమందు వర్షములు ఎక్కువగానుండినవి,

మధ్యధరా సముద్రంలో జర్మనుల సామగ్రి నౌకలపై బ్రిటీషుజలాన్తర్గాములు టార్పెడోలు వేయుటచే డిసంబరు౫తేదిన రెండుజర్మనునౌకలు మునిగిపోయినవి ౧౨నౌకలు నాశనమైనవి,

#### రష్యా

రష్యాలో చెర్కసీ, కొరోస్టెన్, రాగాచెవ్ ఝ్లోబిన్ అను తెల్లరష్యాలోని మూడుపట్టణములను పట్టుకొనుటకై రష్యావారి సేనలు పోరాడుచున్నవి. స్మోలెన్స్కనుండి ఆర్షాకుపోవు జర్మను రక్షణ శ్రేణిని భేదించినవి? మద్నీపర్నది వంపులో రష్యనుసేనలు అనేకములైన బాటలు కూడలియగు జానామెన్కాకు ఉత్తరమున జర్మనుసేనల గొప్ప దుర్గశ్రేణిని భేదించినవి, స్మేలానుండి జానామెన్కాకుపోవు రైలుబాటను రష్యనుసేనలు భేదించివేసినవి, ఇందువల్ల ఉత్తరభాగమందుండే జర్మను సేనలకు దక్షిణభాగమందుండు వాటితోగల సంబంధములలో నొకటి విచ్ఛిన్నమైనది. తర్వాత రష్యనుసేనలు జనామెన్కాకువాయవ్యదిశయందు ౧౫ మైళ్ళ దూరమందుండు ఇనిబుల్వోవద్ద రైలుబాటను చేరినవి, ఇపుడు జనామెన్కానుండి డానిప్రోపెట్రోస్కువరకుగల రైలుబాటలన్నియు జర్మనుసేనలకు ఉపయోగించకుండ విచ్ఛిన్నములు చేయబడినవి,

రష్యనులు అలెగ్జాండ్రియాను పట్టుకొని, క్రిమెన్చుగ్ను విడచిన దానికి నైరుతిదిశలో వేగముగా ముందుకు పోవుచున్నారు,

క్రిమెన్చుగ్కును కిరొవొగ్రాడ్కును మధ్య రోడ్లు, రైళ్ళుకలియునట్టి స్థానమగు కిరొవొగ్రాడును నాలుగువైపుల ముట్టడిలో యిరికించుటకును రష్యనులిపుడు యత్నించుచున్నారు, రష్యనుసేనలు కిరొవొగ్రాడుకు ఇపుడు ఒకవైపున ౧౫ మైళ్ళ దూరములోనికి వచ్చిచేరినవి.

డిసంబరు ౯తేది ఉదయంనుండి జర్మనుసేనలు చెర్నియాఖోవ్కు ఈశాన్యమున కీవునగరమునకు పోవు బాటలయందు క్రొత్తటాంకు యుద్ధమును ప్రారంభించి అంతకుముందు ఎక్కువ ప్రదేశము నాక్రమించిరి;

గామెల్ వాయవ్యంలోను క్రిమెన్చుగ్కు పడమటను కొన్నిగ్రామాలను, దొర్కుఅను బాటలకూడలి యొద్దనుండు మర్గాలను జర్మనుసేనలు కోల్పోయినవి.

#### చర్చిల్ రూజ్వెల్టు గారలతో తుర్కీ అధ్యక్షుని సంభాషణ

డిసంబరు ౪వ, ౫వ ౬వ తేదులలో తుర్కీ అధ్యక్షుడగు ఇనూనుగారు ఈజిప్టునందు కైరో నగరములో చర్చిల్, రూజ్వెల్టుగారలతో సంభాషించిరి. తుర్కీవిదేశాంగమంత్రి మెనెమెన్జియోగ్లుగారుకూడ సంభాషణలలో పాల్గొనిరి ఈసంభాషణలనుగురించి చేయబడిన అధికారప్రకటనలో ఈక్రిందివిషయము లున్నవి —

ఈసంభాషణలయందు ముఖ్యముగా రాజకీయ పరిస్థితి సమీక్ష వ్యవహారం వివరింపబడెను ముగ్గురి దేశముల భిన్నభిన్న వ్యవహారములతో, సమానావసరములను దృష్టియుంచుకొని ముందును అనుసరించదగిన విధానమును పరిశీలించిరి... ప్రపంచమందు ఇప్పుడున్న పరిస్థితినిగురించి ముగ్గురు దేశాల వైఖరులలో పరస్పర విరోధములు లేకుండ ఉన్నవి. బ్రిటను అమెరికా రష్యాతుర్కీల మైత్రీసంబంధమునకు ఈసంభాషణలవల్ల ఎంతయో ప్రయోజనము చేకూరినది.

సంభాషణలలో బాల్కను రాజ్యాలయందు జర్మనులపై దండయాత్రను జరుపుటనుగురించియు సిరియా, లెబనాను రాజ్యాల సమస్యనుగురించియు, తుర్కీవారు తమభూమిపై బ్రిటిషుమిత్రమండలివారి సేనలకు మూలస్థానాలు ఇచ్చుటకు ఒప్పుకొనుచో తుర్కీవారికి అమెరికానుండిఆయుధ కౌలుపద్ధతిపై సౌకర్యములను ప్రసాదించుటను గురించియుకూడ — అసంభాషణలలో చర్చించినట్లు రూటరు విలేఖకుడు సూచించినాడు.

తుర్కీఅధ్యక్షుడు సపరివారంగా తుర్కీని డిసంబరు ౯తేదిన చేరుకొనిరి; తుర్కీవిదేశాంగ మంత్రి అనాడు బ్రిటిషు మిత్రమండలి రాజ్యాలలోని పత్రికలయొక్కయు, తటస్థ రాజ్యాలలోని పత్రికలయొక్కయు ప్రతినిధుల ప్రశ్నలకు సమాధానములిచ్చుచు తుర్కీప్రభుత్వమువారి విదేశసంబంధములను గురించిన విధానములో మార్పేదియు లేదనిరి. ఈసంభాషణల ఫలితంగా తుర్కీ ప్రభుత్వము యుద్ధములో ఏపక్షమునగాని పోరాడుటకై చేరక మిత్రమండలివైపు వాలకంచూపినదని తలచవచ్చునని పత్రికల ప్రతినిధులు సూచింపగా, విదేశాంగ మంత్రిగారు అంతేననిరి.

కైరోలో తుర్కీఅధ్యక్షుడు ఈజిప్టురాజు ఫరూఖ్ గారితోకలిసి సంభాషించిరి.

కైరో ప్రాంతములో చర్చిల్ గారితోకూడ వచ్చియుండిన బ్రిటిషు విదేశాంగమంత్రి ఈడన్ గారు గ్రీసు, యుగోస్లావియాల రాజులతోను, యుగోస్లావియా ప్రధానమంత్రితోను సంభాషించిరి. చర్చిలుగారు ఆప్రాంతములోని బ్రిటిషు రాజకీయ సైనికాధికారులనేకులతో సంభాషించిరి.

డిసంబరు ౬వ తేదిన తుర్కీప్రధానియగు సారజోగ్లుగారితో తుర్కీలోని జర్మను రాయబారి యగు వానాపేపెన్ గారు సంభాషించిరి.

గోలకొండ పత్రిక

న్వభాను సం॥ర మార్గశిర బ: ౨ సోమవారము

# 'స్థానికభాషల పోషించుట'

హైదరాబాదు సమాచారమను ప్రభుత్వమాసిక పత్రికలో పై శీర్షికతో కొన్ని వాక్యాలను వ్రాసినారు. ప్రభుత్వ పత్రికలో వ్రాసిన వాటిలో ఏవైనా అసంగతములుండిన వాటిని విమర్శించకపోతే జనులలో అపోహములకు తావు గలుగును. కావున వారు వ్రాసిన సంపాదకీయములోని కొన్ని వాక్యాలను విమర్శించవలసి వచ్చినందులకు చింతిల్లుచున్నాము.

"ముల్కీ భాషల "బోధనమునకై మంచి ఏర్పాట్లు చేయబడినవని పల్కుటకు తెలిసినట్లుగా లేదు." అని అన్నారు. అది నిజమే. మంచి యేర్పాట్లు చేయబడలేదని అందరికిన్నీ తెలుసును. తెలియనిదే ప్రజాహిత సంస్థలన్నియు విద్యావిధానముపై ఎడతెగకుండా విరుద్ధముగ తీర్మానాలు చేసినారంటే వారబద్ధ ప్రచారము చేసినారని అనవలెను అయితే హై. సమాచార దృష్టిలో మంచి ఏర్పాట్లు అంటేయేమి? "ప్రాథమికతరగతులలో విద్యార్థుల కందరకును వారి మాతృభాషయందే విద్య గరపబడును"అని అన్నారు. ఇది సరికాదు. ప్రాథమిక తరగతులలో సాధారణముగా రెండవ లేక మూడవ తరగతి నుండి ఉర్దూ ప్రారంభమగుచున్నది- "విద్యా విధానములో" ప్రాథమిక తరగతులలో ఉర్దూ చెప్పవలెను అను శాసనమున్నది. కాని సెకండరీవిద్యలో ప్రధానభాషఉర్దూయే, తెలుగుప్రధాన భాషకాదు కనుక. ఉర్దూ మాతృభాష కానివారు తెలుగులో మూడవ నాల్గవ తరగతులు చదివినచో సెకండరీ విద్య ప్రారంభించుటలో చాల కాఠిన్యము అగును కనుక మూడవతరగతి ఉర్దూలోనే చదవవలసిన వారగుచున్నారు. వీలయినగా నాల్గవతరగతి వరకు తెలుగు ప్రధానభాషగా గైకొనిన బాలురు ఆకస్మికముగా లెక్కలు, భూగోళం చరిత్ర, వాచకాలు, సర్వం ఉర్దూలో చదువవలెనుక దాఅదెట్లుసాధ్యం కావున మూడవ తరగతినుండియే ఉర్దూ పర భాషగా చచ్చిచెడి చేయంగల విన్న పములతోసహా ఉర్దూ విభిన్న మాతృభాషకలవారు ఉర్దూను చదివితీరవలసినదే. ఈపద్ధతి రాష్ట్రమందలి ప్రాథమిక బళ్ళలో సంతటను ప్రచారములో ఉన్నదోలేదో ప్రభుత్వమువారు విచారింపజేసిన తెలియరాగలదు.

"ఎనిమిదవ తరగతివరకు బాలికలకుకూడా వారి మాతృభాషయందే విద్య గరపబడును"అని అన్నారు. అది ఎంతో ఆందోళనము చేసిన తర్వాత నిన్నమొన్న సిద్ధించిన తపఃఫలిత వరప్రసాదము, అయితే పై తరగతులలో ఎట్లున్నది? చెప్పరేలనో? అట్లయితే బాలికలకు మిడిల్ చదివి చాలించుకోవలెనా? తటాలున అయిదవఫారములో అంతా ఉర్దూమయంలోపడి వారేమి నేర్చుకోగలరు. మరి సర్కారీబాలికా పాఠశాలలలో మిడిల్ తరగతులలో ఈ ఏర్పాటున్నదా కాస్త హై. సమాచారము వారు విచారించుకోనగలరు.

"లోవర్ సెకండరీ తరగతులలో ఉర్దూ మాతృభాష కానివారికి వారి మాతృభాష చదువుట విధివిహితమొనర్చబడినది"అని మరొకవాక్యము వ్రాసినారు. ఇది మేముఎరిగినంతవరకు ఎచ్చటను కానరాలేదు. లోయర్ సెకండరీ తరగతులలో ఉర్దూరానివారు "విధిగా" తమ మాతృభాషలో చదువనట్లుగా విద్యావిధానపు శాసనములో కాని సూత్రాలలోకాని అనుబంధనియమములలోకాని యెచ్చటను కానరాదు. అట్లైమైనా శాసనసూత్రము లుండిన ప్రకటనశాఖవారు వాటి హవాలా యిచ్చిన తెలుసుకొని మా యీ విమర్శను దిద్దుకొని వారిభావానికి బాగా ప్రచారమియ్యగలము. విధివిహితమనుట చాలామంచిమాట. మేమున్నూ లోయర్‌లో హైయర్ సెకండరీలోను "విధివిహితముగా" మాతృభాషను ముల్కీ మాతృభాషలను చెప్పించవలెనని యెల్లప్పుడునూ అంటూఉంటాము. అందు లోయర్ సెకండరీ హద్దువరకిదివరలోనే "విధివిహితము"అయియుంటే చాలా సంతోషము. కాని అదే లేదని అంటున్నాము.

"విశ్వవిద్యాలయములో విద్యార్థి తన మాతృభాష నేర్చుకొనవచ్చును, ఎం.ఎ.లోకూడా ముల్కీ భాషలు తీసుకొనవచ్చును" అని వ్రాసినారు. ఈసంవత్సరము ఎం.ఏ. తెలుగు మూఇబడినది. ఎందుకనగా "వచ్చును" అనుపదముచేత అది మూతబడినది. ప్రభుత్వభాష, ఉద్యోగభాష ఉర్దూ ఉండగా తెలుంగీ, మరాటీ, కన్నడీలను ఎవరు అభిమానించుతారు. ఈ"వచ్చును"అను సెలవు ప్రచారానికి పనికివచ్చును. దాని విలువ అంతే!

"ఇక్కడి స్థానికభాషలు బోధకభాషలుగా ఎన్నడునులేవు" అన్నారు. అంటేయేమి? ప్రాథమిక తరగతులలో లేవా? లోయర్ సెకండరీలో విధివిహితముగా బోధయగుటలేదా? పైవాక్యాలన్నీ యీవాక్యముచే యెగిరిపోయినవైనా? ఒకవేళ లేకపోతే అదొకతర్కమా? ముందు ఎన్నడునూ లేకుండెను. కాన ఇకముందుండగూడదు అని అంటారా? అట్లయితే ప్రపంచము నాశనమైపోగలదు. "ఉర్దూభాష ఇంగ్లీషువలె విదేశీయభాషకాదు" అన్నారు. ఈ మాట ౪౦ ఏండ్లక్రిందట చెప్పియుంటే ఒప్పుకొంటూ ఉండేవి. ఇప్పుడు ఉర్దూలో నూటికి ౭౫ పాళ్లు ఫార్సీ, ఆరబీ పదాలు నిండినవి. ఫార్సీ, అరబీభాషలు విదేశభాషలే. దేశీభాషపదాలు, హిందీ పదాలు పూర్వమువలె ఉర్దూలోబహుళముగా "విధివిహితముగా" ఏర్పాటు అయినప్పుడు ఉర్దూదేశీభాష అగును. ఇప్పటి ఉస్మానియావిద్యాపీఠపు ఉర్దూ "ఇంగ్లీషుకంటే సులభము" కాదు సులభముకాదని హై. సమాచారం వారున్నూ గమనించినారు. అందుచేతనే వారిట్లువ్రాసినారు. "ఉర్దూను సులభము చేయుటకును, అనవసరమగు అరబీ ఫార్సీపదము లందునుండి తొలగించుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. "హిందూస్థానీభాష తక్కిన భాషలకంటే ఎక్కువవ్యాప్తి చెందియున్నది." అని మరొకవాక్యము సమాచారము వారు వ్రాసినారు. ఈవాక్యము బాగా లేదు. వ్యాప్తియే ప్రధానమైతే అంతకంటే వ్యాప్తిలోనున్న ఇంగ్లీషుభాష, ఫ్రెంచిభాష, చీనాభాష మనరాష్ట్రములో ప్రవేశపెట్టవలసివచ్చును. ఒకవేళ ఒకభాషకు అధికవ్యాప్తి యుంటే దాని నాధారముగాచేసి తక్కువ వ్యాప్తిలోనుండే భాషలను "విధివిహితముగా" అణగద్రొక్కుతారా? ఆభాషల అభివృద్ధికి సహాయం చేయనేచేయరాదా? బ్రిటిషిండియాలో అధిక వ్యాప్తిగల హిందీభాషనే జనులపై రుద్దుటలేదు- మరి యీ రాష్ట్రములో ఉర్దూకు అధిక వ్యాప్తి లేనే లేదు. ఇది నూటికి ౧౦ మందిచేతనే మాట్లాడబడుచున్నది. గత జనాభాలెక్కలో చూడగా ఈ ఉర్దూ రాష్ట్రములో అనేక ముసల్మానులచేతగూడా మాట్లాడబడునది కాదని తెలిపినది. కొన్ని తెలంగాణా జిల్లాలలో ముసల్మానుల సంఖ్యకన్న ఉర్దూమాట్లాడువారిసంఖ్య తక్కువగా హైదరాబాదు ప్రభుత్వజనాభావారే లెక్కించి నిరూపించి ప్రకటించినారు! దీనిభావమేమి?

"ప్రభుత్వమువారిటీవల ఒక విద్యాసలహా సంఘమును నెలకొల్పిరి". అని వ్రాసినారు నెలకొల్పితే ఏమైనట్లు? అసలహాసంఘము ప్రజాప్రతినిధులది కాదు. ప్రభుత్వమువారే పసందుచేసుకొని నామకరణముచేసి ఏర్పాటుచేసుకొన్న సలహాసంఘము. అట్టి సంఘములోనికి ఆంధ్ర కర్ణాట మహారాష్ట్ర మహాసభల అధ్యక్షుల నామకరణము పొందిపోయినను వారికిప్రజలదృష్టిలో ఏమియువిలువలేదు. అట్టి సంఘచర్చలకేమి విలువయుండును. పైగా అవి మతపాక్షిక (Communal )సంఘాలుగా నుండును. అందు సరాసరి సగం ౫౦ హిందూ ముస్లిములుందురు. అందు అధికారులుందురు- కావున వాటిలోచర్చింపబడు విషయాల ప్రజాసంస్థలు కోరిన కోరికలకు అనుగుణ్యముగా నుండునని ఎవ్వరున్నూ కలలుకాంచుటలేదు

మన రాష్ట్రముయొక్క విద్యావిధానము చాలా లోపభూయిష్ఠము- బాబెహూకుమతులో వందేమాతర ఆందోళనకాలములో విద్యార్థులకు మతవిద్య ముల్కీ-భాషలలో నియ్యవలెనని వినియుంటిమి. కాని యిటీవల ఉ- విపీఠ సెనేటిలో బహుళ సంఖ్యాకుల వోట్లచే అదేసమస్య త్రోసివేయబడెనని వింటిమి- విద్యాశాఖ డైరెక్టరుగారు ఇతరాధికారులు, ముల్కీ-భాషల సంబంధము లేనట్టి ఆరావముదయ్యంగారు వంటివారు ముల్కీ భాషలలో మతవిద్య నేర్పుటకై ఓటు యిచ్చిరట- కాని లాభమేమి? ముల్కీ-భాషలపు పండ్లు పటపట కొరుకువారే సెనేటిలోఅధికమైనారు- ఇకపై మాటలుగా చూడండీ- మూతబడిన ఏం- ఏ తరగతులూ? చూచండీ ప్రైమరీ తరగతులు అని ఎగ్గాడిగా ప్రదర్శన వినోదాలు చూపించితే ఏం ఒలికిపడుతుంది-

## క్రొత్త ప్రకృతివైద్య మాసపత్రిక

౭-౧౨-౪౮ పడమటిలంక (బెజవాడ)

"శ్రీ సీతారామావధూతయోగవ్యాయామ ప్రకృతికళాశాల ప్రారంభోత్సవము "ప్రాకృతజీవనము" అను యోగవ్యాయామ ప్రకృతివైద్య సచిత్ర మాసపత్రికయొక్క ఆరంభోత్సవము, "ఆరోగ్యసదనము" ప్రకృతి [చికిత్సాలయము] యొక్క చతుర్థ వార్షికోత్సవము ౧౯౪౯,జనవరి ౨వ తేదీ ఆదివారమునాడు శ్రీ సకలకళా విచక్షణ, సాహిత్యప్రాపక,శతావధానిగా శ్రీకృష్ణమాచారిగారి అధ్యక్షతక్రిందజరుగును. పైవానియొక్క సంస్థాపకులు శ్రీ సీతారామావధూతగారు.

వి. నాగేశ్వరరావు బి. ఎ. యల్.డి.

## సభ ఆగిపోయినది

హైద్రాబాదు నగరములో రాజా బహద్దరు వెంకటరామారెడ్డిగారి అధ్యక్షతలో ఆంధ్రవిద్యార్థిసభ ౭ డిసెంబరునుండి మూడుదినాలు జరుగునని సెలవిచ్చినాలనుండి వినవచ్చెను, తీరాసభాదినమునాడుసభలేదు సభ లేదు ఇదేమయ్యా అని విచారించగా సర్కారువారు సభకు సెలవియ్యలేదట.అని తెలియవచ్చెను. (ఒ వి.)

## అగ్గువ అంగళ్లు

ఘ. వ. బీరారు యువరాణిగారు 3 డిసంబరునాడు హైద్రాబాదు నగరములో మహబూబు మెహిందీ, మూదాప్రుళీ, మంషీర్‌గంజ్, చావుని, చింతలబస్తీ అను అయిదుస్థలాలలో భుక్తిసహాయపు సంఘమువారిచే స్థాపింపబడిన ౫దుకాణాలను తెరచిరి. ఆసందర్భములో వారికి రాజా బహద్దరు వెంకటరామారెడ్డిగారు స్వాగతమిచ్చిరి భుక్తిసహాయక సంఘసభ్యులు పుష్పగుచ్ఛమిచ్చిరి. శ్రీవారి గౌరవార్థము తెరచిన దుకాణాలవారు బీదలకు ఒక్కొకసంచి జొన్నలుఉచితముగా పంచిపెట్టిరి. ఈ అయిదు దుకాణాలలో ఒక్కొక్కదాని ౧౦౦౦మంది బీదలకు చిట్టీలిచ్చి వారికి యితరదుకాణాలలో దొరికే జొన్నలకంటే రూపాయికి ఒకసేరు ఎక్కువగా అమ్మ ఏర్పాట్లు చేసినారు,

ఆంతర్విద్యాపీఠ సంఘసభ సర్ యస్.రాధాకృష్ణగారి అధ్యక్షతలో హైద్రాబాదులో ౧౧ డిసెంబరునాడు ప్రారంభమయినది. ౧౨, ౧౪ డిసెంబరు తేదీలలోకూడా సమావేశమగుచున్నారు. హిందూస్థానములో ౧౫ఏండ్లకాలములో పూర్తిగా విద్యావ్యాప్తి చేయుటకై సార్జంటుగారిచే సిద్ధముచేయబడిన ప్రణాళికనుగూర్చి ఆలోచింతురు. దేశమందు ఏయేభాగములలో విద్యార్థులకు విద్యచెప్పవలెను, ఇంగ్లీషుభాషకు మనదేశమందు ముందెగతిపట్టించవలెను. పరిశ్రమ పరిశోధనశాలలలో ప్రవేశపెట్టుట, విద్యా పీఠాలలోని విధానమందు మార్పులు మన్నగునని ఆలోచించి నిర్ణయింతురు.

ఉస్మానియా విద్యాపీఠ రజతోత్సవము కొన్ని కారణములచే ఆపివేయబడినది.

... ...

హైద్రాబాదు రాష్ట్రములో ధాన్యంస్టాకు ఉండే రైతులువ్యాపారులు అందరున్నూ తమవద్ద ఉండే స్టాకులెక్కలు నెలనెలకు అధికార్లకుపంపవలెను. అమ్మినప్పుడు లైసెన్సు పొందవలెను. వారందరున్నూ ముందుగానే లైసెన్సు పొందియుండవలెను. సర్కారువారు నిర్ణయించిన ధరకమ్మవలెను. ప్రతి తాలూకాకు తహసీల్దారు లైసెన్సుల నియ్యగలరు.

... ...

పూర్వం ఘనాత్మమంత్రిగా నుండిన నవాబు తిలావత్ జంగుగారు చనిపోయినారు.

... ...

## శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషానిలయం

సుల్తాన్ బజారు హైదరాబాదు (దక్కన్)

పైనిలయమున ౧౦ డిసెంబరునాడు నవ్యాంధ్ర సాహిత్యగోష్ఠి జరిగెను. నిజాంకళాశాల ప్రొఫెసరుగారు శ్రీయుత సరిపల్లె విశ్వనాథశాస్త్రిగారధ్యక్షతవహించిరి. అధ్యక్షులు మొదటఉపక్రమోపన్యాసములో నవ్యాంధ్ర సాహిత్య రీతులను బాగుగా వివరించి వీనిముందలి యాత్కృష్యమును కాలమే నిర్ణయించగలదని సెలవిచ్చిరి.

తర్వాత గిడుగు గారి భాషాసేవనుగురించి శ్రీఖండవల్లి లక్ష్మీరంజనముగారి యుపన్యాసము చదువబడెను. శ్రీయుత పి. దుర్గయ్యగారు "అవధానకవిత తిరుపతి వేంకటకవులు"అనే విషయముపై నుపన్యసించిరి.

శ్రీయుత ఖండవల్లి బాలేందు శేఖరముగారు పానుగంటివారి ప్రతిభా విశేషములనుగురించి ముచ్చటించిరి.

శ్రీయుత బి. విశ్వనాథముగారు శ్రీవ్యాలివారి నవలలకు సారస్వతమునందుస్థానము వారిరచనా విశేషములనుగూర్చి ముచ్చటించిరి.

అధ్యక్షులు ఉపసంహారోపన్యాసానంతరము నిలయపక్షమున వందరికిని ధన్యవాదములతో సభ ముగిసెను.

హిందూ స్మశానవాటిక ప్రబంధకసమితివారు పండిత బాలకృష్ణశాస్త్రి గౌలిగూడ హైద్రాబాదు నివాసుల అంత్యక్రియ కర్మలు చేయించుటకు నియమించినారు. వివరములు కనుగొనవలెనన్న కార్యాలయమును రాజబహద్దుర్ రాయ్ విశ్వేశ్వరనాథ బంగ్లాలో విచారించగలరు.

## ఇండియాప్రభుత్వ వశము లోనికి మరిరెండు రైల్వేలు

రాబోవు ఏప్రిలునెల ప్రారంభమునుండి యం. యస్. యం. రైల్వేను, యస్. ఐ. ఆర్. రైల్వేనుకూడ ఇండియాప్రభుత్వమువారే వశపరచుకొని పనిజరుపుటకై రాయబారములు ముగింపవచ్చినవి. యస్. ఐ. ఆర్. రైల్వేకంపెనీతో కుదిరిన పరిష్కారము ఇండియాప్రభుత్వమువారికి తెలియజేయబడలేదు. ఇదిఆశ్చర్యముగానున్నది. బెంగాలు నాగపూరు రైల్వేవారితో చేసికొన్న కాంట్రాక్టు ౧౯౫౦లోగాని గడువుతీరదు.అందువల్ల ఆరైల్వేను ఇండియాప్రభుత్వమువారు వశపరచుకొనుటకు మరికొంతకాలము పట్టవచ్చును. దక్షిణహిందూ దేశములోని రైల్వేలలో కుదుర్చుకొనినకంట్రాక్టు ౧౯౫౪ లోనే ముగియగలదు.

## సైనికులను సేనలనుండి రప్పించుట

ఆస్ట్రేలియా, న్యూజీలాండుల అవసరము

సర్ వాల్టర్ శిట్‌గారు ఆస్ట్రేలియా న్యూజీలాండులలో సంచారముచేసి డిసంబరు ౪ తేదిన సాన్‌ఫ్రాన్సిస్కోకువచ్చినపుడు ఇట్లుచెప్పిరి:— "పనులుచేయుటకు మనుష్యులు చాలకపోవుటవల్ల; ఆస్ట్రేలియా, న్యూజీలాండులు వారల సేనలనుండి సైనికులను రప్పించుకోనవలసివచ్చును."

ఆంధ్ర చేంబర్ ఆఫ్ కామర్స్, మదరాసు

యింజనీరింగు సామానులను తయారుచేయు పరిశ్రమల యజమానుల సలహాసంఘమునందు 'ఆంధ్రచేంబర్ ఆఫ్ కామర్స్' కు ప్రతినిధిగ బెజవాడలో ఆంధ్ర యింజనీరింగు కంపెనీకిచెందిన శ్రీ బి. వి. రెడ్డి, బి. ఏ. గారు ఎన్నుకొనబడినారు.

## అరెస్టులు శిక్షలు

అహమ్మదాబాదు డిసంబరు:—నేడుదయము రాయెపూర్ప్రదేశములో జరిపిన ఒక ఊరేగింపును పోలీసులు చెదరగొట్టిరి. ఒక పోలీసు పై రాళ్ళురువ్వుటవలన పోలీసు వానికి గాయమైనది. అతనిని ఆస్పత్రికిజేర్చిరి. నేడు మరిరెండు ఊరేగింపులు జరిగినవి. పోలీసులు రాగానే అవి చెదిరిపోయినవి. మరొక పోలీసువానికి గాయమయ్యెను. మరొకడు అరెస్టు జేయబడెను.

బెల్గాం, డిసంబరు ౯;

బెల్గాంనగరంలో కాంగ్రెసు పతాకమును ధరించి ఊరేగుచు, కాంగ్రెసు నినాదములను జేయుచుండిన ౨౩మంది నేడు నగర పోలీసులచే అరెస్టుజేయబడిరి.

హుబ్లి, డిసంబరు:—నేడు హుబ్లిలో కాంగ్రెసు సంబంధమైన వాక్యములుగల అట్టలను ధరించి కాంగ్రెసు నినాదములనుజేయుచు ఒక వీధిలో ఊరేగుచు పోవుచుండినవారలలో మంది నేడు ౪మంది స్త్రీలతో కలిపి ౩౧ మంది అరెస్టుజేయబడినారు.

## బలవంతపు మత పరివర్తనం ఇస్లాంమతము ఒప్పదు

అఖిలభారత ముస్లింలీగు కార్య సమితి సభ్యుని సమాధానము

అఖిలభారత ముస్లింలీగు కార్యసమితిసభ్యుడగు యం.ఏ. హెచ్. ఇస్ఫానిగారు "ఓరియంట్‌ప్రెస్" వారికి పత్రికలలో ప్రకటింపజేయుటకొరకై ఈ క్రిందివాఙ్మూలమును వ్రాసియిచ్చిరి:-

సావర్కరుగారు నవంబరు ౨౮ తేదీన బొంబాయి నుండిపంపిన వాఙ్మూలమును చదివి నేను నిర్ఘాంతపోతిని. తూర్పుపాకిస్థానప్రదేశములలోతిండిలేక మాడుచున్న వందలకొలది హిందూస్త్రీలను, హిందూ శిశువులను తమమతములోనికి జేర్చుకొనుటకై ముసల్మానులు గట్టిఏర్పాటులతో ఉద్యమించుచున్నారనియు, ముసల్మానులు చచ్చుచుండే హిందూ మాతకుగాని, ఆమెబిడ్డలకుగాని తినుటకు ఒక్కగ్రాసమైననుఇవ్వక, వారలు ప్రాణాలు వదలుచుంటే ఊరకచూచుచుండెదరనియు, ఈహిందూ స్త్రీలను, వారలశిశువులను తమకిష్టమైనహిందూ మతమునువదలిపెట్టి చచ్చుటకు పూర్వము ముసల్మానుమతములో చేరినకేగాని వారలను రక్షించరనియు, సావర్కరుగారనినారు. సావర్కరుగారు చెప్పినమాటలు పూర్తిగాఅబద్ధములని నేను చెప్పగలను. ఇస్లాంమతము బలవంతపు మతాంతర పద్ధతిని ఒప్పుకొనదు."

## ఖమ్మంనుండి బెంగాలునిధికి విరాళము

(స్వ. వి.)

చౌకడిపోలకొరకై వసూలుచేయుచున్న ఆదాయమండలి అవకాశమును గమనించిఖమ్మం చౌకడిపో కమిటీవారు రూ. ౨౦౦౦ రెండువేలరూపాయీలు బెంగాలునిధికి పంపుటకు తీర్మానించారు. తీర్మానము ప్రవేశపెట్టినది ప్రెసిడెంట్ ఖాజాసాహెబుగారు.

ప్రభుత్వమువారిచే ఏర్పాటుచేయబడిన చౌకబట్టలదుకాణములు రెండింటిలోను మోహనలాల్ కంపెనీ సికింద్రాబాదువారిచే మరి నాల్గు దుకాణములను చౌకబట్ట(సర్కారువారిది)సప్లయి చేయబడి ప్రజలకు విరివిగా దొరుకుచూవేయు న్నది. ధరల హెచ్చుతగ్గు అమ్మకాలల్లోను కొల్తలలోను శ్రద్ధవహించవలసియున్నది.

ప్రభుత్వమువారు నిమ్నజాత్యుద్ధరణకై గత వత్సరము ఒకలక్ష రూపాయీలు మంజూరుచేసి యుండిరి. ఖమ్మం స్థానిక హరిజనవిద్యాలయాల కొరకు హాస్టలుకొరకు సహాయము నర్థించియుండిరి మొదట కొంతఆశ చూపించిరికాని చివరకు అవకాశములేదని తెలియజేసిరి. ఈవత్సరము హాస్టలు నిర్వహణ కష్టముగానుండుటచే ఆర్గనైజర్ శ్రీ. రోశయ్యచౌదరిగారు గ్రాంటుకోసము మరల అర్థించారు. ఈవత్సరమునందైనా మా ఖమ్మం నిమ్నజాత్యుద్ధరణ సంస్థలకు సహాయము దొరుకుతుందని ఆశిస్తున్నారు.

### ఖమ్మం ఆంధ్రబాలికా పాఠశాల

ఈపాఠశాల నిర్వహణకుగల ఇబ్బందులను గమనించి శ్రీయుత రాయిపూడి వంగయ్యగారు ఈగా రాములుగారితో మనవిచేసికానపాఠశాలకొసంగిన భవనముపై తాత్కాలికముగా వచ్చుచున్న రూ ౪౦లు నలభైరూపాయీల అద్దెను పాఠశాల నిర్వహణకిచ్చునట్లు ఏర్పాటుచేసిరి. శ్రీ రాధాకృష్ణరైసుమిల్ వారు తమమిల్ ప్రారంభోత్సవసమయములో రూ౫౦౧౦లు విరాళమును అర్: మోహనలాల్ కంపెనీవారురూ౫౦౧౦లను దయతోనొసంగిరి, మిల్లు యజమానులందరును కలసి ఈబాలికాపాఠశాలకు శాశ్వతఆదాయమును ఏర్పాటుచేయ సంకల్పించినట్లు తెలియుచున్నది. ప్రోత్సాహకులగు శ్రీ రాయిపూడిరంగయ్యగారు ప్రశంసనీయులు.

---

## ఖమ్మంలో ఆంధ్రవిద్యార్థి మహాసభా సమావేశం

(ఒ వి) ఖమ్మం

౭-౩-౪౩ సోమవారం సాయంత్రం ౫గంటలకు శ్రీయుత దాశరథి కృష్ణమాచార్యులగారి అధ్యక్షతన శిరంవారివసతిభవనమునజరిగెను. అధ్యక్షులవారు "విద్యార్థికర్తవ్య" మునగూర్చియు,ప్రత్యేకముగా ఆంధ్రవిద్యార్థికి భాషావశ్యకతనుగూర్చియు అర్ధగంటసేపు ఉపన్యసించిరి. చాలామంది వీతెంచిరి. కార్యనిర్వాహకవర్గపు యెన్నికలు జరిగెను. సి. యచ్. ఆచార్యాగారు ప్రధానకార్యదర్శులుగా ఎన్నుకొనబడిరి సభలోనేచందాలువేసి హైద్రాబాదు కేంద్రసమితికి ఒక డెలిగేటునుపంపిరి.

---

## త్యాగరాజస్వామి ఆరాధన

(ఒ. వి.) ఖమ్మంమెట్టు

ఈసంవత్సరం పుష్యబహుళంలో స్వామివారి ఆరాధన ఉత్సవాలు ఖమ్మంమెట్టులోని కళారాధకమండలి యాజమాన్యమున జరుపనిశ్చయించాం రాష్ట్రీయగాయకులుకూడా తప్పక పాల్గొనాలని మాకోరిక,పాల్గొన తలచిన కళాభిమానులు ఈ మార్గశిరాంతంలోగా తెలిపిన,కార్యక్రమంఅచ్చొత్తించుటకు వీలుండును గాయకులెవ్వరెవ్వరెచట ఉన్నది తెలుసుకొనే మార్గాంతరంలేక ఈపద్ధతిని అనుసరిస్తున్నాం. తామైతేలుపుటను స్వయంతగా గాక ప్రార్థనగాభావించి మరీ తెల్పుమంటున్నాం గాయకులకు ప్రయాణపుఖర్చులూ, భోజనసదుపాయంతోపాటు,సమంగా శక్త్యానుసారంసత్కరించదలిచాం. మమ్మల్ని ప్రోత్సహిస్తారనిఆశిస్తున్నాం,

ఇట్లు

రామానుజాచార్యులు. నీలకంఠరావు

కార్యదర్శులు

---

## ఆర్యప్రధాన్ యింటనృత్యము

(స్వ వి) మహబూబునగరం, బహిమన్ ౨ వారమురోజుల క్రిందట గోలకొండపత్రికలో "ఆర్యప్రధాన్ యింటనృత్యము" అనే శీర్షికపై ప్రకటింపబడియుండెను. ప్రేక్షకుడు పొరపాటున పురుషున్ని స్త్రీగాభావించెను నిజముగా భారతనాట్యము జరిగినట్లు తెలియుచున్నది. సవరణకై పంపనైనది.

---

## ఆలంపూరు

(ఒ వి.)

### హరిజనపాఠశాల (జిల్లాపురము)

సుమారు నెలరోజులక్రిందట శ్రీ గంగుధర్మారెడ్డిగారు జిల్లాపురంగ్రామములో హరిజనపాఠశాల అను తన స్వగృహములో స్థాపించియున్నారు. ఎనిమిదిమందిబాలురుప్రతిదినమువచ్చి శ్రద్ధగాచదువుచున్నారు. పాఠశాల దినదినాభి వృద్ధిగాంచుచున్నది

### పల్లెపాడు గ్రామము

ఇది జాగీరుగ్రామము. శ్రీరామేశ్వరరెడ్డిగారు సొంతవ్యయముతో ఒక మెట్రికుచదివిన స్కూలుమాస్టరునుపిలిపించిపాఠశాలనునడిపించుచున్నారు. ౧౫బాలురు ప్రస్తుతము చదువుచున్నారు శ్రీవారి కృషి ప్రశంసనీయము.

### చిరుతపులి

సుమారు నెలరోజులక్రిందట ఒక చిరుతపులి పల్లెపాటి పొలిమేరలో ఒకబాలేలునుచంపి తినిపోయెను. తర్వాత ౧౫రోజులక్రిందట గద్వాలసంస్థానంలోజేరిన దువ్వాసిపల్లిలో యిదేచిరుతఒకదున్నపోతును చంపినది. రెండురోజులతర్వాతయిదే గ్రామములో ఒకబాలుని చంపివేసినది, కాని యింతవరకు యీ చిరుతను వేటాడి చంపినవారు లేరు,

### బెంగాలు క్షామనిధి వసూళ్లు

శ్రీయుత గంగుధర్మారెడ్డిగారు ఆలంపూరు తాలూకాలోను, గద్వాల వనపర్తి సంస్థానముల గ్రామాలలోను బెంగాలు క్షామబాధితుల నిమిత్తము చందాలు వసూలుచేయుచున్నారు అహార ప్రయాణ యిబ్బందులను లెక్కించక శ్రీరెడ్డిగారు చురుకుగా చందాలు వసూలుచేయుచున్నారు,

### ధర్మవరం. గ్రంథాలయస్థాపన

ధర్మవరం గద్వాల సంస్థానంలో చేరినది, సుమారు ౧౫౦౦ జనసంఖ్యగలదు, విద్యార్థులు చాలాగలరు. యువకులంతాచేరి ఒక గ్రంథాలయమును స్థాపించినారు. పుస్తకములు౩౦౦లకై సేకరించినారు క్రొత్తగ్రంథాలు చాలా తెప్పించుచున్నారు.

---



## మోసపుపెండ్లిండ్లు

మానుకోట, డిసెంబరు ౭

మానుకోటతాలూకా మరియు దాని పరిసర గ్రామప్రాంతములలో ఒకసంవత్సరమునుండి పదిపదిహేనుమంది వైశ్యులు బెజవాడ పైప్రాంతములనుండి వడ్డెర, కాలి, గౌండ్ల, తదితరకులాలపిల్లలను కొనితెచ్చి వైశ్యులని ప్రత్యక్షముగను పరోక్షముగను వివాహములు జరుపుకొనుచున్నారు. సదరు పిల్లలను మూడువందలరూపాయిలకుకొనిదాదాపు తొమ్మిదివందల రూపాయీలకు లాభసాటి బేరముగా విక్రయించుతూ మోసగించుచున్నారు కాబట్టి వైశ్యులు యికముందు యిలాంటిమోసములలోపడక వైశ్యకులబంధువులకు పాత్రులుకాకుండుటకై మోసగించినవారిపై క్రమచర్యతీసుకోవలయునని ప్రభుత్వమును కోరుచున్నాము.

భువనగిరి నారాయణగుప్త

---

# హిందూస్థానములో క్రైస్తవమత క్షీణదశ

## వాటికన్ మాటలకు సావర్కరుగారి ఖండన

రోమను కాథలిక్ క్రైస్తవుల జగద్గురువగు పోపుగారిచేత పక్షమున ప్రకటితమగుచుండు 'అబ్జర్వేటర్సు' రోమానో అను పత్రికలో "ఉపఖండమగు హిందూస్థానములో క్రైస్తవమత జ్యోతి ఇదివరకే ప్రకాశించుచున్నది. ఒకనాడు అప్రకాశము జాజ్వల్యమానముకాగలదని మాకు ఆశ యున్నది" అనుమాటలు ప్రకటితములైనవి. ఆమాట లకు అఖిలభారతదేశ హిందూమహాసభయొక్క అధ్యక్షులగు వి. డి. సావర్కరుగారు ఖండన వచనములను "యునైటెడు ప్రెస్" వారికి ప్రకటనార్థము ఇచ్చినారు. ఆఖండన వచనము లిట్లున్నవి.

"ఈ ఉపఖండములో క్రైస్తవమతజ్యోతి ప్రకాశించుచున్నదని గాని అది ఎవరియుంటబ వారు సంతోషములోచేయు ప్రచారమువల్లనైనను, కలాక్కారల ప్రచారమువల్లనైనను జాజ్వల్యమానము కాజాలునని గాని తలచుచూ దేవుడైనను తాను అవివేకమువల్ల అట్లు తలచినట్లు తొందరలో గ్రహించగలడు. చెట్టు ఎటువంటిదో పండునుబట్టి చెప్పబట్టుయితే, ఆక్రైస్తవమతము ఇంతవరకే వందల కొలది ఏండ్లుగా ఏకచ్ఛత్ర పరిపూర్ణముగ ప్రకాశించుచున్నదో ఆయూరోపుఖండములోను, అమెరికాఖండములోను దానివల్ల ఏర్పడిన జనులవర్తనమునుబట్టి దానిలక్షణము నిర్ణయించవలసియుండును. కాని ఈదీప్తినుండి వచ్చుచున్నవాసన తుపాకీమందు వాసనవలెనే పిరాడకుండ చేయుట తప్ప మరేమియు కనపడదు.

ఇండియాదేశము క్రైస్తవమతములో జాజ్వల్యమానముగ ప్రకాశింపవలెనని కోరుట్లకు వాటికన్ వారికి ఇప్పటికంటె...—హిట్లరు, ముసోలినీ, చర్చిల్, రూజ్వెల్టు గారలను, ఇంకనుదా దాపు అన్ని క్రైస్తవజాతుల నాయకులను ఒకరొకరి నాశనముకై సెదమును శపథములు చేయుచున్నట్టియు, కాంటినెంట్యు ప్రభువుయొక్క ప్రధాన పురోహితుల నగరమగు వాటికన్.. నిన్న మొన్నటివరకు ముసోలినిని గౌరవించుచుండి, నేడు విమానాల బాంబుదెబ్బలక్రింద పడిపోవుచు తనను రక్షించవలసినదని మొఱపెట్టుచున్నట్టియు శాసనముయుక్తం పరిహాసాస్పదమైనది మరొకటి ఉండజాలదు.

వీటెనిబట్టి క్రైస్తవమతముయొక్క మంచిచెడ్డలను చెప్పవలసినచో, మేము భగవంతుడా మమ్ములను క్రైస్తవ మతోద్ధారకునినుండి రక్షింపుమాయని ప్రార్థించవలెను.

అట్లుగాక క్రైస్తవమతముంటే "ఆ కొండపై చేసినబోధయొక్క సారము" అనేటట్లయితే, పోపుగారితో మేము "వైద్యుడా మొదట నీయొక్క రోగమును కుదుర్చుకొనుము" అని చెప్పవలసియున్నది హిందూస్థానము బుద్ధుని జన్మదేశము. ఆబుద్ధుని దశధర్మములను చూచియే క్రైస్తవమతపు దశనియమములను నవి అనుకరించబడినవి. హిందూస్థానము ఉపనిషత్తులజన్మదేశము, ఆ ఉపనిషత్తులనుండియే బుద్ధుడు దశధర్మములను సంగ్రహించుచుండెను. అట్టిహిందూస్థానము తన జాగ్రత్తను చేసికొనగలదు.

వాటికన్‌కు సత్యము తెలిసినపుడు, శుద్ధిసంఘటనోద్యమము ఆరంభమైనప్పటినుండి, క్రైస్తవ మతప్రచారము నానాటికి హీనమైపోవుచున్నది, హిందువులు క్రైస్తవమత జ్వాలోపద్రవములో చిక్కుకొనకుండుచున్నారు. క్రైస్తవమతములో చేరియుండిన వేలకొలది హిందువులు తిరిగి తమ ప్రాచీన హిందూజాతియొక్క మత, సంస్కృతులలోనే గాక, రాజకీయ సాంఘికములలోకూడ చేరిపోవుచున్నారు."

——

# జాతీయపక్షానికి విన్నపము

జాతీయనాదమంటే భాషా సాధంపైన రూపొందింపబడిన ఒకవిజయపతాకమని, ఆసాధంతోనే ఆజాతివారంతా తమతమ అవసరాలు తీర్చుకొంటూ రోజకసమిష్టికుటుంబబాధ్యతలతో ముందంజవేస్తారని వేరుగాచెప్పనక్కరలేదు. ఈసమిష్టిబాధ్యతలలో ఎవరుఓపంతేనీ నాయింటిపెద్దలు మాత్రం వారబడగూడదు. వాటినుండి దూరం కాగూడదు. అలాఅయితే యీసాధంతోలమట్టుకావడంతప్పదు. ఇది మనసంస్కృతి.

పై వివరాన్నిబట్టిచూస్తే మన సంస్థానములో జాతీయవిజయపతాకం ఛిద్రించి పోయియుండదని, ఆభాషాసాధం క్రమశః పడిపోయియుండదనిగట్టిగా చెప్పవచ్చు. అందుకుగల ముఖ్యకారణాలుజాతీయవాదులయొకట నుండికే ఉచితమార్గాలు చేసు కుంటారేమోయన్ని, యీశ, అందుకేనాయీమనవి

మనసంస్థానంలోని జాతీయవాదులలో ఆంధ్రపితామహులగు శ్రీ మాడపాటి హనుమంతరావుగారు, బూర్గుల రామకృష్ణరావుగారు, మందుముల సోదరులు. శ్రీ కొండా వెంకట రంగారెడ్డిగారు ముఖ్యులు, వీరియభివృద్ధే జాతీయాభివృద్ధి. కాని "తీరిక సమయాలలో దేశసేవ" అనేవీరిని నాదం, ఆచరణ, జాతీయయువకులకు ఆదర్శమైపోయింది. యువకులంతాపూర్తిగా వారికాలాన్ని జాతీయరంగంలో యుపయోగించుకోలేక పోతున్నారు. కాబట్టి పెద్దలలో కొంతమందియైనా, పూర్తిగా జాతీయకార్యక్రమాన్ని చేపట్టేవారు కావాలి.

యప్పుడే కేంద్రంబలిష్టమయి,జాతీయశ్రేష్ఠలోనున్న జాతీయయువకులకోర్కె నెరవేరుతుంది. ప్రస్తుతం నామమాత్రంగానున్న జాతీయకేంద్రంచి గిర్చి పుష్పించుతుంది. ఫలిస్తుంది. ఇదివెనుకటిది.

ఇక రెండవదిభాష. భాషావిషయంలోఆంధ్రమహాసభవారి విశాలదృష్టిప్రశంసనీయం అదియేను. అంత్యలోను తీర్మానాలరూపేణ ప్రభృతులు ప్రకటిస్తున్నారు. కాని యీ కార్యక్రమంచాలదనే నిజాంరాష్ట్ర సార్వతపరిషత్తుబయలుదేరింది. కాని పరిషత్తును, అభివృద్ధికితెచ్చేమార్గాలు యింతవరకు ఆంధ్రమహాసభవారు వారికార్యకర్తలకు సూచించినట్లు కాన్పడదు, అయితే, ని.రా.సా.పి. ప్రత్యేకసంస్థఅని వదలుతారేమో! కాని భాషనుకూడ యీయుంచుకోనిపనిచేయడం ఆం.మ.స. వారికేవుంచిది.

మూడువది, రాజకీయసంస్థయైన కాంగ్రెసుకు, గ్రామోద్యోగ సంఘం, చరఖాసంఘం, యిత్యాదిప్రత్యేకవిషయాలలో, ఏవిధంగాశాఖలుగాయుండి రాజకీయరంగానికి దూరంగాయుండి, నిర్మాణకార్యక్రమంచేస్తున్నవో, అలాగే ఆంధ్రమహాసభవారుకూడా వారికార్యక్రమాన్నిపంచ్ఛివిధస్థాయకులకీయడం మంచినిర్మాణకార్యక్రమము, ఆం. మ. స. వారికి స్వచ్ఛంద సేవాదళాన్నినిర్మించిగలుగుతుంది, కాబట్టి యీలోటుగూడా పూర్తిచేసుకోవాలి.

నాల్గవది, పి పి.జోషి,ముఖ్యుచెందినకాంగ్రెసు రావి నారాయణరెడ్డి వర్గంవారి ప్రస్తుతనినాదం "ఐక్యతతో" పనిచేయడమయినా, బొట్టు అందినంతవరకే పీరియానైతే అని అనుభవజ్ఞులైన కార్యకర్తలకు తెలియకపోదు. కాననే జాతీయవాదులు యీవర్గంతో కలసి పనిచేయడమా! లేక స్వతంత్రంగా పనిచేయడమా! అనేదిగూడా జాతీయనాయకులు తేల్చాలి.అనుభవంలో మాత్రంకలిసిపనిచేయడమంటే తీరికసమయాలలో దేశసేవచేసే జాతీయనాయకవర్గం ప్రక్కను మొదలంటా యీడ్చబడమయితాయుంది. కానస్పష్టంగా జాతీయనాయకులను జాతీయతత్వాన్ని బలపరచడానికి, సంపూర్ణత్యాగశీలురతో యున్న కేంద్రంకేంద్రితంగా నిర్వచింపబడిన జోషీముఠాయందలి వైఖరి; కార్యక్రమవిధానం; నిర్మాణకార్యక్రమ సహాయానికి స్వచ్ఛంద సేవాదళాన్నినిర్మించవలెనని సగౌరవంగా ప్రార్థన.

కొంపల్లి ఆంజయ్య.

——

# బడిపిల్లలకు పురపాలక సంఘమువారి పాలపట్టాటు

బొంబాయి పురపాలక సంఘము యొక్క స్థాయిసంఘము నిన్నటిదినం జరిగిన సమావేశములో పురపాలక సంఘమువారి బళ్ళలోపిల్లలకుపాలిప్పించుట రూ 1,80,000లను మంజూరుచేసినది.

——

# గ్రామ దేవతకు బలులు

డిసెంబరు ౪ తేదితో ముగిసినవారంలో కలకత్తా నగర పాలకసంఘమువారి జననమరణపట్టిక లెక్కల్లో ౧౫౯౮ మంది మృతులసంఖ్య తేలినది. ఈ నగరంలో డిసెంబరు ౪ తేదిన అన్ని ఆస్పత్రుల లెక్కలు కలుపగా ౩౧ మంది క్షుద్బాధితుల సంఖ్య తేలినది.

## కలకత్తానుండి హిందూ క్షుద్బాధితులను పంపివేయుట

### ఖాక్సారు సంస్థ సేవకు సౌకర్యము—హిందూ సంస్థలకు లేదు

కలకత్తా, డిసంబరు ౭

అఖిలభారత హిందూమహాసభయొక్క అధ్యక్షులుగ పనిజేయుచున్న డాక్టర్ శ్యామప్రసాద ముఖర్జీగారు ఇట్లు పత్రికలకు తెలిపినారు.—

క్షుద్బాధితులైన హిందూ స్త్రీ పురుషులను బెంగాలు బయటికి ఖాక్సారులచ్చే పంపించివేయబడుచున్నారను వార్తవల్ల ఇండియా అంతటను, విశేషించి బెంగాలులో హిందూప్రజల మనస్సులకు కష్టముకలిగించినది. ఈవిధముగా ౧౫౦౦ మంది తీసికొనిపోబడినారు. అట్టి క్షుద్బాధితులకు రైలు ఛార్జీలను భరించెదమనియు, ఒక్కొక్కరికి తిండి ఖర్చుకై అయిదు రూపాయీలు నిచ్చెదమనియు బెంగాలు ప్రభుత్వమువారు ప్రకటించి యుండిరి. క్షుద్బాధితులైన హిందువులను బెంగాలు బయటి రాష్ట్రములకు పంపివేయుటకై హిందూమహాసభయును ఆర్యసమాజమున్ను ఏర్పాట్లు జేసినను వారలకు ఈసౌకర్యము ఒసగబడలేదు. నేను ఈవిషయమై బెంగాలు ప్రధానమంత్రి సర్ నాజిముద్దీన్ గారి సన్నిధికిపోయి ఖాక్సారులకిచ్చు చున్నట్లేమాకును సౌకర్యమీయవలసినదని అడిగితిని.

క్షుద్బాధితులైన హిందువులను ఖాక్సారులు బెంగాలునుండి పంపివేయుటను హిందువులు సమ్మతించరుకాబట్టి, అట్లు ఖాక్సారులు హిందువులను తీసికొనిపోవుటను వెంటనే నిషేధింపగలమని సర్ నాజిముద్దీన్ గారు మాట యిచ్చిరని తెలుపుటకు నాకెంతయు సంతోషముగనున్నది.

## లాహోరు సినీమాలు మూతపడినవి

లాహోరు, డిసంబరు ౭

పరిశ్రమల కొఱకై పగలుగాని రాత్రిగాని ఎప్పుడుగాని విద్యుచ్ఛక్తిని వ్యయము చేయరాదని ఆజ్ఞ చేయుటవల్ల లాహోరులోనున్నూరు సినిమాల భవనములు మూతపడినవి.

## రామారావుగారికి దానము

లక్నోలో డిసెంబరు౩తేదిన లక్నో పత్రికయగు 'నేషనల్ హెరాల్డు' సంపాదకుడైన శ్రీ రామారావుగారి గౌరవార్థము జరిగిన తేనీటివిందు సభలో రావుగారికి వారిమిత్రులు రూ౧౦౦౦లను ఇచ్చిరి.

### ఇండియాకు చేరిన ఆస్ట్రేలియా గోధుమలు

ఈసంవత్సరము ఇండియాకు ఆస్ట్రేలియానుండి ౧౫౦౦౦౦ టన్నుల గోధుమలు పంపించబడినవని ఆస్ట్రేలియా ప్రభుత్వపు వ్యవసాయశాఖమంత్రియగు విలియం జేమ్సుస్కల్లీగారు డిసెంబరు ౩ తేదిన తెలిపినారు. ఆగోధుమలు చాలామట్టుకు ఇండియాలో క్షామము ఏర్పడిన కారణము పంపించబడినవని తెలిపినారు.

## కొన్ని విదేశ విశేషములు

### ఇటలీకి మిత్రమండలి సైనిక రాయబారము

బ్రిటను, అమెరికా సంయుక్త రాష్ట్రము రష్యాలనుండి సైనిక ప్రతినిధులు కొందరుకలిసి ఇటలీకి మనమిత్రమండలిపక్షమున సైనిక రాయబారులవర్గముగ వెళ్లుచున్నారు.

### స్పెయినులో బ్రిటిషు కన్సలుకు అపచారము

స్పెయినులో ఫలాన్జిస్టుపార్టీకి చేరిన కొందరు యూనిఫారముదుస్తులతో నవంబరు౧౫వ మరియు ౧౬వ తేదులలో సారగోసాలోనుండిన బ్రిటిషు వైస్‌కన్సలర్ అధికారి ఆఫీసుకు పోయి ఆయనను, ఆయన కుటుంబములోని వారలను నానా దూషణలనుచేసిరి. ఇందుకై స్పెయినువారు క్షమాపణకోరుచు, అల్లరిపెట్టినవారలను అరెస్టు చేసెదమని అభయవచనము నివ్వవలెనని బ్రిటిషు ప్రభుత్వమువారు స్పెయిను ప్రభుత్వమువారి నడిగిరి. స్పెయిను ప్రభుత్వము క్షమాపణ చెప్పుకొనినది.

### జర్మనీలో బ్రిటిషు ఖైదీలకు విన్సెంట్ కుమారుని వినోదనములు

ఇటలీయా సైన్యాధిపతిగా ఉండిపోయిన విన్సెంట్ గారికొమరుడగు ఫాన్‌బౌక్ ప్రభువు జర్మనీలో బ్రిటిషు యుద్ధఖైదీల వినోదపెట్టుటకు ఉపయోగించబడుచున్నారని జర్మను రేడియో మాట డిసెంబరు౧ తేది రాత్రి లండనులో వినిపించినది.

### లెబనాన్ రాజ్యము వారి సంపూర్ణ స్వాతంత్ర్య యత్నము

లెబనాను రాజ్యపు ప్రధాన మంత్రి నవంబరు ౧ తేదిన గావించిన ఒక ప్రకటనలో లెబనానులో ఫ్రెంచివారి కట్టిఅధికారమూగాని లేకుండ సంపూర్ణ స్వాతంత్ర్యమును స్థాపించు విషయమై ఫ్రెంచి వారికిని లెబనానువారికిని సంభాషణలు త్వరలో జరుగగలవని చెప్పిరి. లెబనాను రాజ్యాంగమును సవరణచేయవలెనని శాసన సభవారు నవంబరు ౭ తేదిన చేసిననిర్ణయము ఇంకను అమలులో నున్నదనిరి. డిసెంబరు౫వ తేదిన ప్రధాన మంత్రిగారు శాసనసభయొక్క సమావేశమును ఇవేసంగతు లనుతెలిపిరి. సభ్యులు ఫ్రెంచివారి అధికారమును తాత్కాలికమైనంతమాత్రము సహించజాలమని ఉపన్యసించిరి.

ఇంగ్లండుమీదికి శత్రువుదండయాత్ర చేయుచో ఇంగ్లండుప్రజలెట్లు వర్తించుకొనవలెనో నవంబరు ౩౦ తేదిన రేడియోలో తెలుపబడినది.

## మైసూరు రాజకీయ ఖైదీల విడుదల

బెంగుళూరు డిసెంబరు౭

భారతదేశరక్షణ నియమాల ప్రకారము ఖైదు జేయబడియున్న రాజకీయఖైదీలు సుమారు ౫౦ మంది నేడు వదలివేయబడినారు. ఇప్పుడు మైసూరు సంస్థానములో భారతదేశరక్షణ నియమాలననుసరించి ఖైదులోనుండువారలు లేనేలేరు.

## లెబనాన్‌లో పోరాటము పాకిస్థాన్ ప్రతిఘటనయే

లెబనానులో మొన్న మొన్నటివరకుజరిగిన ఫ్రెంచి అధికారులతో పెట్టుకొన్నపోరాటము దేనికొఱకు? స్వాతంత్ర్యముకొఱకా? స్వాతంత్ర్యము లెబనాన్ ప్రజలకు ఫ్రెంచివారిచే అనేకపర్యాయములు యివ్వబడినట్లు ప్రకటించబడినది. వారల పోరాటము అరబ్బు రాజ్యమును అఖండముగ నుంచుకొనుటకే, అనగా, ఆదేశమును పాకిస్థాన్ పాలుగాకుండ రక్షించుకొనుటకే, అదెట్లో చరిత్ర చూచిన తెలియగలదు.

లెబనాన్ ప్రాచీనములో ఉండిన రాజ్యము కాదు. సిరియాలోఉండు ఒక కొండను బట్టి దానికా పేరువచ్చినది. సిరియా అరబ్బులదేశము. అరబ్బులు పూర్వపు ఐరోపా మహాసంగ్రామములో బ్రిటిషుమిత్రమండలి వారలు తమకు స్వాతంత్ర్యము నిప్పించెదమని ఆశపెట్టగా తురుష్క సామ్రాజ్యముపై తిరుగబడిరి. కాని యుద్ధానంతరము జరిగినసంధిలో మిత్రమండలివారు గప్‌చుప్‌గా అరబ్బులరాజ్యములను చీలికలుచేసి తములో తాము పంచుకొని వాటికిని రక్షకులముగానున్నామని సాకుచెప్పిరి. ఇరాఖు, పాలెస్తీను బ్రిటనుకుపోయెను. సిరియా ఫ్రాన్సుకు చేరెను. ఇట్లు అరబ్బుల కాశాభంగమయ్యెను.

ఫ్రాన్సుకు లభించిన సిరియాలో అరబ్బులు స్వాతంత్ర్యతృష్ణతో తపించుచు, అరబ్బులరాజ్యమంతయు అఖండముగ నుండవలెనని కాంక్షించు ఫ్రెంచిఅధికారమునకు ఎదురుతిరుగు చుండిరి. అక్కడి అరబ్బులలో క్రైస్తవమతస్థులు, ఇస్లాంమతస్థులు కూడ గలరు. ఫ్రెంచివారు వారలలో చీలికలుపెట్టి రాజ్యముసాగించుటకు వీలైనభేదతంత్రము లన్నిటిని ప్రయోగించిరి. కాని ప్రజలవిశ్వాసము చెడలేదు. అప్పుడు ఫ్రెంచిఅధికారులు దేశమునే చీలికలుగచేయదలచిరి. సిరియాఅంతటి జనసంఖ్య ౩ లక్షలు. అట్టిచిన్నరాజ్యమును ఫ్రెంచిపాలకులు ఆ యిదుచిన్నరాజ్యాలముగ విభజించిరి.

పడమటి సముద్రతీరమునకు లెబనాన్ కొండ లున్నవి. ఆకొండలసమీపమున ప్రదేశము లెబనాన్ రాజ్యమునబడెను. ఇక్కడ ఎక్కువమంది క్రైస్తవులలో నొక తెగకు చేరినవారలు ఫ్రెంచి పాలకులు వీరలను అరబ్బులనుండి చీల్చితమపక్షానికి త్రిప్పుకొనుటకై వారలకు ప్రత్యేకమైన గొప్ప హోదానిచ్చిరి. లెబనాన్‌కుఉత్తరమున సముద్రతీరమునానుకొని మరొకచిన్నరాజ్యము కొండల ప్రదేశములో స్థాపించబడెను. అక్కడఅలావీలు అనబడు ముసల్మానులుండిరి. దానికిం కొత్తరఢ అలెగ్జాండ్రెట్టా అనేరాజ్యమేర్పాటు చేయబడెను, ఇదితుర్కీకి అమ్మకొనియుండెను. ఇందులో తురుష్కులెక్కువగ జనులుండిరి. ఈవిధంగా సిరియానుండి కొన్ని సారవంతమైనభూములను చీల్చివేసి, దానిని సముద్రమునుండి దూరముచేసిరి. చాలాకాలము నుండి సిరియాకుమధ్యధరా సముద్రముతోగలసంబంధమునుడు త్రెంచివేయబడెను. ఇందంతోచాలక ఈమిగిలియున్న సిరియాలోనుండి కూడ కొండ జాతులుండే జెబెల్ డ్రూజ్ అనుదానిని వేరే రాజ్యముగాచేసిరి. ఈ కొండజాతులు డ్రూజులు అనబడుదురు. కాని ఆడ్రూజులు ఇట్లు చీలిపోవుటకు ఒప్పుకొనక తిరుగుబాటుచేసిరి. వాటినన్నిటిని ఫ్రెంచిసేనలు నిర్దయగాఅణచివేసినవి.

ఫ్రెంచిపాలకులు అల్లరులను క్రైస్తవులకును ముసల్మానులకును ఉండే విరోధాల ఫలితమని చెప్పుచుండిరి. కానిసిరియను లందరును తాము మతముకొఱకై పోరాడుచుండలేదనియు, తమ జాతీయ స్వాతంత్ర్యముకొఱకే పోరాడుచుంటి మనియు విశదము చేయుచుండిరి. ప్రాణాంతికమగు బాటు ప్రారంభములోఏర్పాటుచేయబడిన రాష్ట్రీయప్రభుత్వము తమ ఆశయము అఖండసిరియా యొక్క సంపూర్ణస్వతంత్ర్యమనియు, దాని రాజ్యాంగమును ఏట్టిసవరింపులకు లోనుగాకుండప్రజలెన్నుకొను మహాసభనిర్ణయించవలెననియు ఒకప్రకటనలో తెలిపెను. ...రలతిరుగుబాటు అణచివేయబడినది. ౧౯౩౬లో సైనిక శాసనము తొలగించబడినది. ఒకదానివెంటనొకటి అనేకములైన సమాధానమార్గములు ఉభయపక్షాలచే ఒప్పుకొనబడినవి. ఈమార్గాలచే ఫ్రెంచిపాలకులు ఏతెగవారికి ఆతెగలోనివారే ప్రతినిధులుగ ఎన్నుకొనబడినట్టిపద్ధతిని చొప్పించగోరిరి. ఇంతేనసిన‌ప్పటికి ప్రజాప్రతినిధిపరిషత్తులో జాతీయ దళమే ఎక్కువ చేరి సంపూర్ణమైన ప్రజాప్రతినిధి పరిపాలనపద్ధతి ఏర్పాటుకావలెనని నిర్ణయించిరి.

అప్పుడు ఫ్రెంచివారు ఆ పరిషత్తునురద్దుచేసి క్రొత్తరాజ్యాంగము నొకదానిని యిచ్చినను ఆరాజ్యపు పరిస్థితి నుండుటవల్ల తమపై నున్న కొన్నిభాగములను వేరుపరిచిరి. ఇట్లు ఈనాటి మహాయుద్ధప్రారంభమునకు సిరియాను అనేకవిషయములలో స్వాతంత్ర్యసారము వచ్చినదే అయియుండెను. ఫ్రెంచివారికిగల అధికారమును తొలగించుటయు సిరియానంతయు అఖండమైన ఏకరాజ్యమునుగ జేయుటయు కొఱతపడియుండెను.

ఈచరిత్రతసిరియాలో నేటిపోరాటముకేవలము సంపూర్ణస్వాతంత్ర్యముకొఱకే గాక విచ్ఛిన్నమైన సిరియాను అఖండైకరాజ్యమునుగ చేయుటకొఱకు కూడ, అనగా పాకిస్థాన్‌పద్ధతిని వదలించుకొనుటకు కూడ—అనికనపడుటలేదా?

## చిన్న సంస్థానాలను పెద్దవాటితో కలుపుట

### వైస్రాయిగారి ఆజ్ఞ చెల్లదని కోర్టుతీర్పు

అజ్మీరు, డిసంబరు ౭

కాఠియావాడలో చిన్న సంస్థానాలను పెద్దవాటితో చేర్చుటకై వైస్రాయిగారుచేసినఆజ్ఞ చెల్లదని జాడిషియల్ కమిషనర్ అరుదేషర్ గారును, కవీశ్వర్ గారును, రాయిబహద్దూర్ వర్మగారును కలిసి భావ్నగర్ అభియోగములో తీర్పు చెప్పినారు.

## చిన్న సంస్థానాలు ఆజ్ఞనుల్లంఘించదలచును

రాజకోటు, డిసంబరు ౭

డిసెంబరు ౭తేదినుండి చిన్నసంస్థానాలను పెద్దసంస్థానాలతోచేర్చి వేయనగునని ప్రకటించిన వానికై మూడవదర్జా నాల్గవదర్జాపరిపాలనాధికారముగల సంస్థానాలన్నియు ఆయాజ్ఞను నిరాకరించుటకు తీర్మానించినవి. ఎక్కువకాలవ్యవధిగాని, సహాయసౌకర్యముగాని ప్రభుత్వమువారొసగరేని, ఈచిన్న రాజ్యాలన్నియు కాఠియావాడలోగాని, గుజరాతులోగాని ఉండేసంస్థానాలతో చేరుటకంటె బరోడాతోచేరుటకే ఎక్కువఇష్టపడగలవు.

ఇండియాప్రభుత్వమువారు ఈవిధమగా ఏర్పడిన పరిస్థితినుండితప్పించుకొనుటకు ఏమిచేసెదరో చూడవలసియున్నది.

## తుర్కీలో మళ్లీ భూకంపము

అంకరా డిసెంబరు ౭

తుర్కీకి భూకంపము మీద భూకంపము దెబ్బకొట్టుచున్నది. ఈసారి అనటోలియాలో ఈశాన్యదిశలో ఎర్జ్బర్ ప్రదేశములో భూకంపమువచ్చి రెండుగ్రామాలు నాశనమైనవి, ౫౦ మందిమరణించిరి. ఈప్రదేశములో నవంబరులో పెద్దభూకంపాలు కలిగినవి. పోయినపక్షంరోజులలో భూకంపాలవల్ల ౯౦౦మంది మరణించిరి, ౫౦౦౦మంది ఇండ్లనుగోల్పోయిరి.

## బర్మారాజకీయస్థితినిగూర్చి అమెరీగారి మౌనము

బ్రిటిషు పార్లమెంటు కామనుసభలో డిసెంబరు ౧ తేదిన అమెరీగారిని జపానువారు చేయుచున్న ప్రచారమునకు సమాధానముగ బర్మాను బ్రిటిషువారు తిరిగి రాబట్టుకొనినతర్వాత దాని రాజకీయస్థితి ఎట్లుండునో చెప్పగలరాయని అడుగగా అమెరీగారు ఏమియు చెప్ప నిరాకరించిరి. జపానువారి ప్రచారమునకు తగిన ఉత్తమ సమాధానము మిత్రమండలివారి విజయమేనని అమెరీగారుచెప్పిరి.

## కంపెనీ నుండి మరొక రైలుబాట ప్రభుత్వపరమగును

ఇండియాప్రభుత్వమువారు సౌత్ ఇండియన్ రైల్వేకంపెనీతో కంట్రాక్టును రాబోవుమార్చినెల ౩౧తేదిలో రద్దుచేసి ఆరైలుబాటను తమఅధీనము చేసికొందురని అందనుండి క్రొత్తఢిల్లీలో 'యునైటెడ్ ప్రెస్‌'వారికి ఒక సమాచారము తెలిసినది.

## బొంబాయి కార్పొరేషనుకు కాంగ్రెసు వారల ఎన్నిక

బొంబాయి, డిసంబరు ౭

బొంబాయి కార్పొరేషనులో ఇద్దరుసభ్యుల స్థానాలుఖాళీకాగా, వాటికి అభ్యర్థులుగ నిలువబడిన కాంగ్రెసు వారిద్దరును పోటీలేకుండగనే ఎన్నుకొనబడినారు. వారలలో ఒకరుడాక్టరు గిల్డరుగారు, రెండవవారు పి. యమ్. చవాన్‌గారు. గిల్డరుగారు ఖైదులోనుంచబడి కార్పొరేషను యొక్క సమావేశాలలో వరుసగా కొన్నిసారులు పాల్గొనజాలనందువలన సభ్యత్వమును గోల్పోయియుండిరి.

